Annual Subscription Rs. 2/-only. Reg. No. M. 2749.

A TELUGU MONTHLY JOURNAL OF INSURANCE BANKING AND FINANCE

# BHEEMA PATRICA

# భీమా పత్రిక

భీమా, బ్యాంకింగు, ఆర్థిక, వ్యవహారములను ప్రచారము చేయు మాసపత్రిక.

EDITOR:
S. KANAKARAJU PANTULU

PATRONS

1. K. B. MADHAVA Esq., M. A., A. I. A., (Lond.) F. R. A. S.
CONSULTING ACTUARY
Professor and Head of the Dept. of Mathematical Economics and Statistics,
MYSORE UNIVERSITY, MYSORE.

2. A. KALESWARA RAO PANTULU, Esq., B. A., B. L.,
BEZWADA.



VOL. V BEZWADA—JANUARY 1936 No. 1

# 1936

# భీమా పత్రిక

ఫిబ్రవరి
**20**
తేదీని
వెలువడును




ఏజంట్లకును
కంపెనీలవారికిని
భీమా పట్టాదారులకును
అత్యంతోపయుక్తముగా నుండును.



**విడిసంచిక**
ఏజంట్లకును
భీమాపట్టాదారులకును
రు **1—0—0**

కంపెనీలకు
రు **1—8—0**

విలయువారు —

మేనేజరు,
భీమా పత్రిక, బెజవాడ.

# భీమా పత్రిక

గౌరవ పోషకులు :

మ. రా. రా. శ్రీ. కె. బి. మాధవగారు, ఎం. ఏ., ఏ. ఐ. ఏ. (లండన్) ఎఫ్. ఆర్. ఏ. ఎస్.

,, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, బి. ఏ., బి. యల్.,

సంపాదకుడు: సూరంపూడి కనకరాజు పంతులు.

## భీమా పత్రిక

"భీమాపత్రిక" ప్రతిమాసమున కడపటివారములో ప్రకటింపబడును. జనవరి నెలతో సంవత్సరము ప్రారంభమై డిశంబరు నెలతో సంవత్సరాంతమగును. సంవత్సరములో నెప్పుడైన చేర్చుకొనబడిన చందాదారులు, వెనుకటి సంచిక లున్నయెడల ఆసంవత్సరములో వెనుకటి సంచికలనుగూడ పొందుట కర్హులు. సంవత్సరపు చందాలు విధిగా ముందు చెల్లింపబడవలెను. వ్యక్తు లెప్పుడు చందాదారులుగ చేరి పత్రిక వి. పి. గా పంపుమని కోరెదరో ఆమాస పత్రిక మాత్రము వి. పి. గా పంపబడును. వి. పి. మొత్తము చేరినతరువాత లోగడ పత్రికలు బుక్కుపోష్టుద్వారా పంపబడును. పత్రికలలో ప్రచురింపబడవలసినవిషయము లన్నియు పత్రికాధిపతిగారికి పంపవలెను. మనియార్డర్లు, వ్యాపార సంబంధమైన విచారణలు మేనేజరుగారికి పంపవలెను. వ్యాసముల వాపసుగాని, ప్రత్యుత్తరములనుగాని కోరువారు పోస్టుచార్జీల సతికించి అడ్రసు వ్రాసిన కవరు పంపవలెను. వ్యాసకర్తలు విలేఖరులు, ప్రచురణములకు పంపు విషయములలోని అభిప్రాయములకు సంపాదకులుగాని ప్రకాశకులుగాని, ఉత్తరవాదులు కారు. సంవత్సర చందా రు 2—0 - 0. విడిపత్రిక రు 0—4—0.

వివరములకు: మేనేజరు, భీమాపత్రిక, బెజవాడ.

### BUSINESS NOTICE.

The "Bheoma Patrica" is published in the last week of every mouth. Subscribers who will not receive the Journal by the 15th of the succeeding month, will kindly communicate to the Manager.

The annual subscription is Rs. 2/- inclusive of postage. Single copy costs 4 annas. Subscriptions at whichever time of the year be paid, will cover the period from January to December. All business communications should be addressed to the Manager Contributions should be sent to the Editor. Articles on matters relating to Insurance are welcome. The Editor is not responsible for the views of the contributors.

For particulars:—The Manager, "Bheema Patrica" Bezwada (S. India),

ఇందులోగల ప్రకటనాదివిషయములకు వ్రాయునపుడు "భీమాపత్రిక" అనుపేరుదాహరింపవలసినదిగి కోరుచున్నాము.

అయ్యా!

శ్రీయుత........................................................................................................

గారి సలహా ననుసరించి మీకు యీ పత్రిక పంపించడమైనది. మీరు యీ పత్రికను సాదరాభిమానములతో స్వీకరించి చందాదారుగ చేరి సంవత్సర చందా రు 2/—రెండు రూపాయిలను మనియార్డరుద్వారా పంపించకోరుచున్నాను.

బెజవాడ,
తేది 29—1—36.

మేనేజరు,
భీమా పత్రిక.




(Editorial: Notes)

## I

## స్వకీయము-సంవత్సరారంభము

### Ourselves

1932 సం॥ రం ప్రారంభమునుండి యింతవరకు ఒక్కొక్క మొక్కీలకాని యీ పత్రికను సక్రమముగ నడుపుట కవకాశము గలుగజేసిన ఆ పరమేశ్వరునకు నమస్కరించుచు 1936 నూతన సంవత్సర ప్రారంభములో మా పాఠకులను చందాదారులను అడ్వర్టైజర్లను అందులో ముఖ్యముగా మాకు సర్వవిధముల తోడ్పడిన హిందూదేశములో పనిచేయుచున్న దేశీయ భీమాకంపెనీలవారిని అభినందించుచున్నాము. ఈ భీమాయుద్యమమునకు తోడ్పడువారందరికిని నూతనసంవత్సరములో శుభము గలుగుగాక యని భీమాపత్రికా సంపాదకీయవర్గము వారి యాశయము. ఈ సంవత్సరమునుండి ప్రతిసంవత్సర ప్రారంభములోను ఉగాది సంచికను (Annual number) ప్రకటింప నిశ్చయించుకొంటిమని తెల్పుటకెంతయు సంతోషిల్లుచున్నాము. 1936 వ సంవత్సరపు ఉగాదిసంచిక (Annual-number) ప్రస్తుతము అచ్చులోనున్నది. ఉగాది సంచికను ప్రకటించుట కిదియే నూతనముగుటవలనే ప్రకటనలో కొంతయాలస్యమునకు కారణము. 1936 సం॥రం ఫిబ్రవరి నెల 20 తేదీని ప్రకటింపబడును.

1936 సం॥లో ఆంధ్రభీమాప్రపంచమున ఈ పత్రికయొక్క ఉగాదిసంచిక ప్రకటన చాలముఖ్యమైనదిగ తలంపబడుచున్నది. భీమావ్యాపారాభిమానులందరును ఈ ఉగాదిసంచిక నందుకొని మా యుద్యమమునకు తగు ప్రోత్సాహ మొసంగ వలసినదిగ కోరుచున్నాము.

## II

## క్రొత్త అంకెలు

### (New figures)

ఆంధ్రయినస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్ వారు 1935 డిశంబరు 31 తేదీ సంవత్సరాంతమునకు యిరువదియేడు (27) లక్షలకుపైగా నూతనభీమా వ్యాపారమును సమకూర్చిరని వినుట కెంతయు సంతసిల్లుచున్నాము.

వీరు గతసంవత్సరములో సమకూర్చగలుగుదుమని వేసుకొన్న అంచనాకంటె అయిదు (5) లక్షలు నూతనభీమావ్యాపారమును అధికముగా సంపాదింపగలిగిరి. దీనినిబట్టి భారత భీమా ప్రపంచమునను అందులో ముఖ్యముగా ఆంధ్రదేశములోను వీరి పలుకుబడియు పాఫ్యులారిటీయు వీరు పట్టాదారులకొసంగు ధారాళమైన సౌకర్యములును తెలియగలవు. ఈకంపెనీ స్థాపనకు పూర్వము ఆంధ్రదేశములో యితర రాష్ట్రములలో స్థాపింపబడిన కొన్ని భీమాసంస్థలు పని చేయుచున్నవిగాని ఆంధ్రదేశములో నిజమైన

భీమావ్యాపార ప్రచారము చేసినది వీరే. వీరి ప్రచారమువలననే ఆంధ్రులు భీమావలనిలాభములను విశేషముగా తెలుసుకొని ఎక్కువగా భీమాలను చేయించుట కలవాటుపడుచున్నారు.

ఆంధ్రదేశములో భీమాసంస్థలు యితర రాష్ట్రములలోకంటె ఆలస్యముగా స్థాపింపబడినవన్నమాటేకాని స్థాపింపబడినతర్వాత వ్యాపారమును సమకూర్చుటలో యితర రాష్ట్రముల కెంతమాత్రమును తీసిపోవుట లేదని ఆంధ్ర యిన్సూరెన్సు కంపెనీవారు 1935 సం॥లో సమకూర్చిన వ్యాపారపుఅంకెలే తెల్పుచున్నవి. నేడు పెద్దపెద్దకంపెనీవారమని విర్రవీగుచున్న కొన్ని కంపెనీలవారు సైతము భీమావ్యాపారమును ప్రారంభించిన తర్వాత మొదటి పదిసంవత్సరములలో నిట్టి అభివృద్ధిని చూపియుండలేదు. 1935 సం॥రములో ఆంధ్ర యిన్సూరెన్సు కంపెనీవారు సంపాదించిన నూతనభీమావ్యాపారమును గూర్చి కంపెనీ కార్యనిర్వాహకవర్గమువారిని, వారి ఏజంట్లను, యీ కంపెనీకి వ్యాపారమును సమకూర్చుటలో తోడ్పడినవారిని మేము అభినందించుచు జరుగనున్న సంవత్సరములో ఆంధ్ర యిన్సూరెన్సుకంపెనీవారి వ్యాపారములు యింతకంటె మిగుల అభివృద్ధియగునట్లు కోరుచున్నాము.

## III

## శోకవారిధి

### Ocean of Grief

భర్త చనిపోయిన భార్యవిలాపమునకును, తనయు నెడబాసిన తల్లిదండ్రుల సంతాపమునకును, గురునిర్యాణమునకై శిష్యపరితాపమునకును కొంతకాలమునకైనను మేర కన్పించునుగాని రారాజును గోల్పోయిన ప్రజల దుఃఖమునకు మేరలేదు. రవిఅస్తమింపని అఖండబ్రిటిషుసామ్రాజ్యమునకు ప్రభువును భరత ఖండమునకు చక్రవర్తియునగు పంచమజార్జి ప్రభువు 1936స॥రం జనవరినెల 20 తేదీ సోమవారం రాత్రి 11 గంటల 55 నిమిషములకు స్వర్గస్థులైరి. ఈ దుఃఖవార్త వెంటనే విద్యుద్వేగమున దిగంతవ్యాప్తంబయ్యె.

ప్రపంచమంతయు అట్లుడికిన ట్లుడికి అఖండ శోకవారిధియయ్యె. సార్వభౌముడు పుణ్యచరితుడు. ఇరువదియైదు సంవత్సరములు మంత్రివర్గసహాయముతో అఖండ సామ్రాజ్యమును సుఖముగ పరిపాలించెను. 70 సంవత్సరముల వృద్ధు. ఏకాదశిఘడియలలో ప్రశాంతముగ దివికేగె. భార్య, జ్యేష్ఠపుత్రుడు, మొదలగు రాజకుటుంబమువారందరును దగ్గర నుండిరి. వీరి రాజ్యకాలములోనే ప్రపంచములో నెన్నియో రాజ్యములు నశించె. రాజులు పదభ్రష్టులైరి. రాజకుటుంబములు నశించె. ప్రపంచరాజకీయ వ్యవహారములు తలక్రిందులయ్యె. ఆర్థికపరిస్థితులు తారుమారయ్యె. ఇట్టిపరిస్థితులలో సకలైశ్వర్యములతో తులతూగి 25 సంవత్సరములు ప్రశాంతముగ రాజ్యపాలన యొనర్చి దివికేగిన జార్జిసార్వభౌముడు అదృష్టశాలి. ఆ ప్రభువు ఆత్మకు భగవంతుడు శాంతినొసంగుగాక!

చనిపోయినవారికొరకు ఎల్లప్పుడు దుఃఖించిన, ప్రపంచవ్యవహారములు నడుచుట దుర్లభము. ధైర్యమువహింపవలె తండ్రితర్వాత తండ్రియంతటివాడు జ్యేష్ఠపుత్రుడు, అష్టమఎడ్వర్డుచక్రవర్తి సింహాసనమునకువచ్చె. ఆయనకు భగవంతుడు దీర్ఘాయువునొసంగి సకల ఐశ్వర్యములతో తులతూగుచు సుఖముగ ఆచంద్రార్కము ప్రజల మేలుకోరి సుపరిపాలనచేయునట్లు ప్రసాదించుగాక! రాజ్యపరిపాలనలో ప్రజలును ఆయనకు మిగుల తోడ్పడవలసియున్నది.




## Life Policy Holders

(శనివారఫు సుబ్బారావుగారు.)

S. Subbarow Esq.

భీమా పట్టాదార్లు లేనిదే భీమాకంపెనీలే వుండవు. భీమాచేయగానేవారు పెట్టిన పెట్టుబళ్లలో యితర పెట్టుబళ్ల యెడల నెంత శ్రద్ధగా వుంటారో యీరీతిగా పెట్టుబడి పెట్టిన కంపెనీ వ్యవహారములనుగూర్చి అంతశ్రద్ధయును వహింపవలెను. భీమాకంపెనీలలో పట్టాదార్లే భాగస్వాములు. ఈసంగతి కంపెనీలవారు ఇటీవలనే గుర్తించి భారతదేశంలోవున్న 162 జీవిత భీమాకంపెనీలలో 11 కంపెనీలవారు ఒక్కొక్క డైరక్టరును పట్టాదార్లతరఫున ఎన్నుకొనునట్లు ఏర్పాట్లు చేసిరి. ఒక కంపెనీవారు యిరువురు డైరక్టర్లను ఎన్నుకొనునట్లు నియమావళిలో ఏర్పాట్లుచేసిరి. అంటే నామకార్థంగా వీరిని అందు ఏర్పాటు చేసిరేగాని పట్టాదార్లు లేనిదే కంపెనీలుండవను సంగతిని గ్రహించినా ఆ గ్రహించినదానిని లెక్కజేయక వూరుకుంటున్నారు. పట్టాదార్లలో యీవిషయాలను గూర్చి ప్రబోధం యిప్పుడిప్పుడే జరుగుతోంది. ఈప్రబోధం పెరగకుండా వాటాదార్లతరఫున పెత్తనంవహించే డైరెక్టర్లెందరుందురో అందు సగంమంది వరకు పోలసీదార్ల తరఫున నుండునట్లు జూచితీరాలి.

భీమాపట్టాదార్లు తాముచేసిన కంపెనీయొక్క సాలుసరి నివేదికను, వాల్యుయేషను రిపోర్టును (ఆదాయ వ్యయ లాభములను పంచిపెట్టుటకు తేల్చిన లెక్కల ప్రతులను) జూచుకోవాలి. ఈ ప్రతులను వీరికి కంపెనీవారు పంపునట్లు జూడాలి.

పట్టాదార్లు తమపట్టాలను రద్దు చేసుకోకుండా జూడాలి. భీమాపట్టాదార్లు తమ బంధుమిత్రులలో యీ వ్యాపారమునుగూర్చి వ్యాపింపజేసి యీ వ్యాపారాభివృద్ధికి వీరున్న తోడ్పడిన వున్నంతలోనే దేశము ఆర్థికంగా త్వరలో నభివృద్ధికి రాగలదు.

జీవితభీమాలో నుండేవివిధతరహా పట్టాలు

1. యావజ్జీవితపుభీమా.

2. కొంతకాలం కట్టి మానివేస్తే మరణానంతరం యిచ్చేది.

3. కొన్ని నియమిత వత్సరాలు కట్టినచో వచ్చేది.

4. ఒకేసారి ప్రీమియంమొత్తం చెల్లించి యిక చెల్లించనక్కరలేకుండా నుండేది.

5. తాత్కాలికంగా కొద్దిరోజులుగాని కొద్ది వత్సరాలుగానిచేసి మానివేసేది.

6. వాయిదాలమీద సొమ్ము యిచ్చే పద్ధతి.

7. ఏటేటా యింతసొమ్ము అని యిచ్చేది.

8. బ్రతికివుండగా వచ్చేది.

9. ఇద్దరుకలసి చేసేది.

10. వాటాదార్లుకలసి చేసేది.

11. ఒక సంఘంగాకూడి చేసేది.

12. వ్యాపారఫు భీమా.

13 నిర్ణీత వత్సరాల భీమా.

14. గుంపుగా చేయుట.

15. తన సంపాదన ఉడిగిపోకుండా తాను చనిపోయినతర్వాత కూడ తన వంశీకులకు ఏటేటా వచ్చేది.

16. ఒకప్పుడు హెచ్చు మరో అప్పుడు తక్కువ వాయిదాలతో కట్టేది.

17. అంగవైకల్యముసంభవించినపుడువచ్చేది.

18. ద్విగుణీకృతలాభముతో వచ్చేది.

19 ఏటేటా ఆదాయము యిచ్చే పత్రము వంటిది.

20. పిల్లలకు భీమా.

21. సాలుకు ఓమాటు యిచ్చేది.

22. తాత్కాలికంగా సాలుకు ఓమాటు కొ॥ కొంతకాలం యిచ్చి మానేది.

23. రెండుసార్లు రెండేండ్లు యిచ్చేది.

24. సాలుకు ఓసారిచొప్పున కొన్నిఏండ్లలో యిచ్చేది.

ప్రస్తుతకాలమున పైనవివరించిన వివిధ రకాల భీమాపట్టీలు యీకాలపు సంపాదనను బట్టియు ఆకస్మికమరణములను బట్టియు యిన్ని రకాలు భీమాలు అన్నితరగతులవారు సులువుగా చేయుటకు వీలుండునట్లు ఏర్పాట్లున్నవి.




డా. భో. పట్టాభిసీతారామయ్యగారు
By Dr. Bh. Pattabhiseetharamayya

మన దేశములో జీవిత భీమా వ్యాపారము ప్రారంభమై యిప్పటికి సుమారు 100 సంవత్సరము లైనది. కడచిన 25 సం॥ల నుండి యీవ్యాపారము మరింత యెక్కువగా దినదినాభివృద్ధి గాంచుచున్నది. కాని యిందలి ముఖ్యసూత్రములను మనదేశములోని విద్యావంతులైనను అంతబాగుగా గ్రహించుచున్నట్లు గాన్పించదు. భీమాకంపెనీలకు ఏజెంటుగా పని చేసేవృత్తి ఇప్పటికిని అంతగౌరవప్రదమైనదిగా చాలమంది విద్యావంతులచే భావింపబడుచుండుటయే లేదు. ఉపాధ్యాయవృత్తికూడా మొన్న మొన్నటి వరకు "బ్రతుకలేక బడిపంతులు, చావలేక చదువులబడీ" అనుసామెతక్రింద చాల నిరసనగానే చూడబడుచుండెను. సంగీతవిద్య యాయవారమునకు పనికివచ్చుననియు, నాటకములలో వేషాలు వేయడము మర్యాదకుటుంబమువారికి అనర్హమైన అగౌరవవృత్తిగాను భావింపబడుతుండేవి. కడచిన 25,30 సంవత్సరములలో ఈ పై రెండువృత్తుల నాశ్రయించిన న్యూనత చాలభాగం తగ్గిపోవడమే కాకుండ, వాటికి కొంత మర్యాద, గౌరవముకూడా లభించుట యెంతయో సంతోషదాయకము. భీమాయేజెంటువృత్తికూడ ఇపుడిపుడే కొంచెముగా విద్యావంతులైన మర్యాదస్థుల దృష్టిని ఆకర్షిస్తున్నది.

కడచిన జర్మనీయుద్ధములో నొకానొక సందర్భమున ఇంగ్లండునకు అమెరికాదేశమునుండి కొన్నికోట్ల రూపాయల ఖరీదుగలిగిన ఆయుధ సామగ్రిఅత్యవసరముగాకావలసివచ్చెను. అప్పుడు ఇంగ్లండు నగదుబేరముచేసే స్థితిలోలేకుండెను. అమెరికావారు ఇంగ్లండునకు అరువుబేరము నిచ్చుటకు సాహసించకపోయిరి. అప్పుడు అమెరికాలో పనిచేయుచున్న ఒకఇంగ్లీషుభీమాకంపెనీవారు ఈయాపత్సమయములో ఆదుకొనిఇంగ్లండునకు కావలసిన రొక్కమిచ్చి అవసరమైన ఆయుధసామగ్రి నంతయు ఇంగ్లండునకు సరఫరా చేసి బ్రిటిషు సామ్రాజ్యమును సంరక్షించిరి. జీవిత భీమావ్యాపారము యేజెంట్లు జీవనోపాయమునకుపనికివచ్చే సామాన్యవృత్తికంటె మానవ సంఘమునకు మహోపకారముచేయు ధర్మసంస్థయనిగూడ ప్రజలు గుర్తించవలసి యున్నది. ఈభీమావ్యాపారముచే చావుబ్రతుకులకు సన్నిహితసంబంధ మేర్పడుచున్నది. గతించినతరము వారికిని రాబోయే తరమువారికిని వియోగము లోనే సంయోగము కలుగుచున్నది. దీనిమూలముగా కాలధర్మమునొందిన తండ్రి తన భౌతిక శరీరము నెడబాసినను దుఃఖితులైయున్న తన సంతానమును, మృతుడైనభర్త వైధవ్య దుఃఖార్తయైన తనభార్యను లోకాంతరమునందుండి కూడ పోషింపగలుగుచున్నారు. భీమా చేసిన

మనుష్యుడు "రేపటిదినమున నానంతానమునకు గతి యేమగునా" యని విచారపడనక్కరలేదు. మానవజీవితదుఃఖములన్నిటికి భీమావ్యాపారము పరమచికిత్స. భీమావ్యాపారములో ఆర్థికధర్మమే గాక నైతికధర్మముకూడ నిమిడియున్నది. భీమావ్యాపారముచేసేవారందరు ఈ రెండులక్షణములను గమనించవలసియున్నది. భీమాచేసిన వానికి తనభీమాపట్టావలన లభించే ధనమొత్తము కంటె మనశ్శాంతియే యెక్కువసౌఖ్యదాయకముగా నుండును. పత్రికాధిపతులు ప్రజాసామాన్యమునకు భీమావ్యాపారముయొక్క ఆర్థిక నైతికధర్మముల రెంటిని ప్రబోధముచేయవలసియున్నది. అప్పుడే ఈ భీమాసందేశము ఇంటింటికిని వ్యాపించి మానవజాతికి దుఃఖోపశమనకారి కాగలదు. అప్పుడే భీమాయేజెంటువృత్తిలో నున్నవారికృషి కృతార్థత నొందగలదు. అనేక కార్యములకు పనికివచ్చే అనేకవిధములైన భీమావ్యాపారములు ఇపుడు లోకములో వ్యాపించియున్నవి. దాదాపుగా ఈ భీమాకంపెనీలన్నిటిలోను ఒకలోపము సర్వత్ర వ్యాపించియున్నది. వీనిలో చాలవరకు పెట్టుబడిదార్లైన సాహుకారులచే నిర్వర్తింపబడుచున్నవి. మనదేశములో ఇపుడు షుమారు 190 భీమాకంపెనీలు పనిచేయుచున్నవి. వీనిలో రమారమి 40 కంపెనీలు, పట్టాదార్లే ఖామందులుగా నుండి నడుపుకొనుచున్న మ్యూచుయల్ కంపెనీలుగాను, మిగిలినవన్నియు పెట్టుబడిదార్లకంపెనీలుగాను నున్నవి. ఈ పెట్టుబడిదార్లకంపెనీలు కూడ తమ లాభములలో చాలభాగము పట్టాదార్ల మూలకముగనే లభించుచున్నవనియు, అందుచేత ఆ లాభములో చాలభాగము పట్టాదార్లకే పంచిపెట్టి, మిగతాలాభముమాత్రమే తాము పంచుకొనవలయుననియు అంగీకరించుచున్నారు. ఇంతమాత్రముతో చాలదు. ఈ భీమాకంపెనీలలో వచ్చేలాభములు ఎవరెంత పంచుకోవలెననే విషయముకంటె వాటిని నిర్వహించే అధికారబాధ్యతలుకూడ ఎవరి కెంతవరకుండవలయు ననునదే ఇపుడు ప్రధానవిషయముగా భావింపబడుచున్నది. పట్టాదార్ల కెక్కువ బోనసులిచ్చినను, ఏజెంట్లకు యెక్కువరేట్లకమీషనులిచ్చినను, పెట్టుబడిదార్ల కంపెనీల పరిపాలన వారిని సంతృప్తిపరచజాలదు. ఆపెట్టుబడిదార్ల కంపెనీలలో పట్టాదార్లకును, ఏజెంట్లకును లభించుచున్న బాధ్యతాధికారగౌరవము లేమియను ప్రశ్నయే యిపుడు భీమావ్యాపారమునందు ఆసక్తిగలవారందరి నెదుర్కొనుచున్నది. మనదేశమునకు స్వరాజ్యము కావలెనంటే మన దేశములోని సర్వసంఘములకును స్వరాజ్యము కావలెనన్నమాటే. యజమాని అనుగ్రహించే వరప్రసాదములకంటె సమానప్రతిపత్తివలన లభించే ఆత్మగౌరవమే అనేకరెట్లెక్కువగా భావింపబడుచున్నది.

ఈసంగతిసందర్భముల నెల్ల గమనించి మన దేశములో ఇపుడు దినదినప్రవర్ధమాన మగుచున్న భీమావ్యాపారములోని ముఖ్యమైన లోటుపాట్లను తీసివేసి సర్వవిధముల నాదర్శప్రాయమగు నొకనూతన భీమాకంపెనీని స్థాపించుట అత్యంతావశ్యకమైనది. దీనిలో శాశ్వతమైన ఆర్థికప్రయోజనములుగల వాటాదారులు లేరు. ఈ కంపెనీలకు ఖామందులు, పట్టాదార్లును, యేజెంట్లును మాత్రమే. భీమాపట్టాదార్ల క్షేమప్రయోజనములే భీమాకంపెనీల యుత్పత్తికి ముఖ్యకారణము. ఈ కంపెనీలయొక్క స్థితి వ్యాపకములకు కారణభూతులు, వాటియేజెంట్లు. పెట్టుబడిదార్ల భీమాకంపెనీలలో వీ రిద్దరికిని వచ్చే ప్రయోజనములను అప్రధానముగాచేసి,

వీరిమూలముగా లభించే లాభములను శాశ్వతముగ అనుభవించే స్వయంకల్పితాధికారులైన వాటాదార్లే సర్వప్రధానులుగ నున్నారు. భీమా కంపెనీలలో ఇట్టి పెట్టుబడిదార్లు కొలదిమంది వర్గములుగా చేరి అత్యధికమైనలాభాధికారములను తామే గుత్తగొనుచున్నారు. ఈరోజులలో బ్యాంకింగు భీమావ్యాపారములు కూడ, విద్యుచ్ఛక్తి ఉత్పత్తిస్థానములు, జలాశయములు మొదలైన సర్వజనోపయోగకరములైన సంస్థల వలెనే యుండవలయును కాని కొలదిమందిధనాఢ్యుల ధనాభివృద్ధిసాధనములుగా నుండకూడదు. ఇప్పుడు ఈ పెట్టుబడిదార్ల భీమాకంపెలలోని పట్టామరతులేమి, ఏజన్సీమరతులేమి ఇంచుక గమనించి చూచినట్లయితే, పట్టాదార్ల ఏజెంట్ల ప్రయోజనములకొరకుకంటె వాటాదార్ల లాభప్రయోజనములకొరకే ఈ కంపెనీలు నడిపింపబడుచున్నట్లు విశదము కాగలదు. అందుచేతనే ఇదివరకున్న కంపెనీలలో కనిపించుచున్న లోపములన్నియు సాధ్యమైనంతవరకు లేకుండచేసి హిందూస్థాన్ మ్యూచుయల్ కంపెనీని స్థాపించితిమి.

పెట్టుబడిదార్ల కంపెనీలలో ముఖ్యంగా సర్వాధికార ప్రయోజనములను వాటాదార్లే పొందుచున్నారని మనవిజేసితిని. మ్యూచుయల్ కంపెనీలలో వాటాదార్లు లేరు. వాటాదార్లస్థానములో పట్టాదార్లే పనిచేయుచున్నారు. ఈ మ్యూచుయల్ కంపెనీలవారు కంపెనీప్రారంభ వ్యయములకు కావలసిన పెట్టుబడిధనమునకై వాటాదార్లను చేర్చుకొనకుండా ఏదో యొక రేటు వడ్డీప్రకారము తాత్కాలికముగా అప్పు తీసుకొని తమ వ్యాపారములను సాగింతురు. ఈ మ్యూచుయల్ కంపెనీల పెట్టుబడిదార్లకే డిబెంచరుహోల్డర్లని పేరు. వారి పెట్టుబడి ఋణము తీరిపోగానే వారికిని కంపెనీకిని సంబంధమేమియు నుండదు. ఈ మ్యూచుయల్ కంపెనీలలో కూడ వాటాదార్లు ప్రతిబంధకములు లేకపోయినప్పటికి చాలవరకు ఏకారణముచేతనో పట్టాదార్లు తాము పొందవలసిన లాభప్రయోజనాల నన్నిటిని పొందజాలకున్నారు.

పట్టాదారులే మ్యూచుయల్ కంపెనీలలో సర్వాధికారులుగ నుందురు. పెట్టుబడిదార్ల కంపెనీలలో పట్టాదార్లకున్న కష్టనష్టములు మ్యూచుయల్ కంపెనీలలో నుండనక్కరలేదు. అయినప్పటికిన్ని యీమ్యూచుయల్ కంపెనీలలో కూడా పట్టాదార్లకు కలుగవలసిన సంపూర్ణ స్వత్వలాభములు లభించుటలేదు. ఈ మ్యూచుయల్ కంపెనీలలో చాలభాగము సమర్థులైన చీఫ్ యేజెంట్లద్వారా వ్యాపారముచేస్తూవున్నవి. కేవలము ఆ చీఫ్ యేజెంట్లే తమ పలుకుబడిని వినియోగించి, పట్టాదారుడైరక్టర్ల నేర్పాటు చేసి కంపెనీలను నడిపిస్తున్నారు. రద్దయిన పట్టాలను బ్రతికించే విషయములోగాని, అయాచితంగా దామాషాపట్టాలను మంజూరుచేసే విషయంలోగాని పట్టాదారులకు పూర్తిన్యాయమును కలిగించుటలేదు. చాలభాగము ఈమ్యూచుయల్ కంపెనీలవ్యాపారమును తెరచాటునుండి నడిపించే చీఫ్ యేజెంట్లందరు తమకు రెన్యూయల్ కమీషనువగయిరాలు శాశ్వతముగా నుండేటట్లు మంచిమరతులతో యేదో ఒక కరంపేరట దీర్ఘకాలపు చీఫ్ యేజన్సీకంట్రాక్టులు బిగించుకొని తమ సబ్ యేజెంట్లకు గొంతుకలుకోసే విషయములో ప్రొప్రయిటరీ కంపెనీలకు యేమాత్రమును వెనుదీయకుండా అమ్మన్నవిస్సన్నల కథను జ్ఞాపకము చేస్తున్నారు. అసలు కష్టపడి పనిచేసిన యేజంట్లు తాలూకు రెన్యూయల్ కమీషను యేదోమిషతో యెగగొట్టి

కంపెనీలలో చేర్చుకొనుట చేతనూ భీమా పట్టాలోని అక్రమమైన విషమ షరతుల మూలముగా దురదృష్టవశాత్తు రద్దయిపోయిన పట్టాదారులసొమ్మును కంపెనీలో చేర్చుకొనుట చేతను కంపెనీలకు చాలాలాభములు మిగుల్తున్నవని దాదాపుగా అన్నిభీమాకంపెనీలవారున్నూ సంతోషముతో తమలో తాము చెప్పుకుంటున్నారు. ఇది కేవలము భీమావ్యాపారమున కనర్థకమైన సంకుచితదృష్టి అని చెప్పకతప్పదు. రెన్యూయల్ కమీషను పోగొట్టుకున్న ప్రతి యేజెంటు ఆకంపెనీకే శత్రువు అగుచుండగా, రద్దయిన ప్రతిపట్టాదారుడును అసలు భీమావ్యాపారానికే గర్భశత్రువై పోతున్నాడు. ఈసంగతిని భీమాకంపెనీల శ్రేయోభిలాషులందరు గమనించవలసి యున్నది. ప్రతి కంపెనీవారున్నూ, క్రొత్తవ్యాపారాన్ని వృద్ధిచేసుకొనటానికిపొందే ఉత్సాహతాపత్రయాలలో నాల్గోవంతయినా పాతపట్టాలరద్దునుఅరికట్టుటకుప్రయత్నిస్తున్నట్లు కనుపడదు. మ్యూచుయల్ కంపెనీలైనా యీవిషయంలో ప్రత్యేకశ్రద్ధ వహించి పట్టాదారులకు కలుగవలసిన న్యాయమును కలిగించకపోవుట శోచనీయము.

మ్యూచుయల్ కంపెనీలలోగూడా పట్టాదారులు బ్రహ్మదేవునివలె తమంతటతాముస్వయంభువులు కాజాలరు. వీరినిసృష్టించుటకు ఏజెంటనే ఒక అనుసంధానకర్త అన్నిభీమా కంపెనీలకును ఆవశ్యకము. అట్టి ఏజెంటునకు ఏ భీమాకంపెనీలోనూ గౌరవమయినట్టిగాని,న్యాయమైనట్టిగాని స్థానమే కన్పించదు. భీమాఏజెంట్లు అందరూ తమ పొట్టకక్కూర్తిచే నేటాలుకూలీలవలె ఎముకలు చిల్లులుపడునట్లు కష్టించి పనిచేసి చేసి జవసత్వము లుడిగినప్పుడును కంపెనీల ఆగ్రహమునకు గురియైనప్పుడును శంకరగిరిమాన్యములు పట్టి పోవలసినదే. యేజెంటు పట్టాదారునిచే భీమాదరఖాస్తు వ్రాయించినప్పటినుండి పట్టాసొమ్మును అతనికిగాని, అతనికుటుంబమునకుగాని వసూలు చేసిపెట్టేవరకు ఆపట్టాదారుని పాలిట షోడశకర్మాధికారియైన పురోహితుని వంటివాడు. కంపెనీకి అసలు వ్యాపారాన్ని సమకూర్చుటలోగాని, న్యాయమైన నిర్దుష్టమైన వ్యాపారాన్ని సమకూర్చుటలోగాని యేజెంటు జీవకఱ్ఱ. వైద్యపరీక్ష చేయించడం, దరఖాస్తు మార్పులను అంగీకరింప చేయడం, ఏఏటా ప్రీమియం వసూలగునట్లు చూడడం, రద్దయిన పట్టాలను పునర్జీవింపజేయుట, వయస్సును ధృవపర్చుట, పట్టాదఖలును వ్రాయించుట, అప్పులు, సరెండర్లు, దావామాపాపట్టాలు యిప్పించుట, వేయేల? పట్టాదారుల కంపెనీలమధ్య జరుగవలసిన సమస్తకర్మకాండలకున్ను యీయేజెంటు పురోహితునిసంబంధము ఎంతో ఆవశ్యకము. భీమావ్యాపారమునకు కీలు భీమాఏజెంట్లు. కొన్నికంపెనీలు ఏజెంట్లకు మొదటి సంవత్సరపు ప్రీమియంమీదను రెన్యూయల్ ప్రీమియం మీదను అత్యధికమైన కమీషనురేట్లు పోటాపోటీగా ఇస్తూవున్నారు. ఆ యేజెంట్లు పట్టాదార్లకు రిబేట్లు నిస్తున్నారు. ఇది భీమావ్యాపారాభివృద్ధి కెంతయు అనర్థదాయకము.

ఏజెంటుకు యిచ్చే కమీషనురేట్లనుగురించి తగాదా లంతగా లేవు. అవన్నీ వ్యక్తిపరమైన భేదములు. ఏజెంటు కిచ్చే రెన్యూయల్ కమీషనుపట్టా అమలులో నున్నంతకాలము యిచ్చుటకు వీలుగా ఉండేటట్లే ప్రీమియంమొత్తాలు నిర్ణయించబడినవి. యాక్చుయరీలందరూ యీ సూత్రమును ఒప్పుకుంటారు. కంపెనీలు మాత్రం ఏజెంట్లకు ఆ రెన్యూయల్ కమీషను పూర్తిగాను శాశ్వతంగాను గుటక దిగకుండుటకు

ముఖ్యంగా మూడు ప్రతిబంధకాలు సృష్టించారు. (1) ప్రతిసంవత్సరముఎంతో కొంత కనీసవ్యాపార మిచ్చితీరవలె ననుట (2) ఆఏజెంటు జీవితంతోనే అంతమగుట (3) ఆ ఏజెంటు మరియొక కంపెనీకి పోయినప్పుడు శిక్షార్థముగా ఎగబెట్టుట. ఏజెంట్లు యీ బాధలు పడలేక ఎప్పటి కప్పుడు కంపెనీలను చేతులుమారుస్తూ, 'గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్' అనే నీతివాక్యాన్ని పఠిస్తూ అల్లాడిపోతున్నారు.

పెట్టుబడిదార్ల కంపెనీలలో వాటాదార్లు, పట్టాదార్లు, ఏజెంట్లు అను ముగ్గురికిని మ్యూచుయల్ కంపెనీలలో పట్టాదార్లు, ఏజెంట్లు అను నిద్దరికిన్నీ సమాన అధికార గౌరవ ప్రయోజనము లుండునట్లు చూడవలసియున్నది.

భీమా ఏజెంటు నేటాలు కూలీవలె, తిరస్కృతయైన హిందూభార్యవలె తనకిష్టములేక పోయినను పాతయజమానికే సేవచేసితీరవలె నను నిర్బంధ బానిసత్వము యీ కాలములో బొత్తిగా హర్షింపబడుటలేదు. భీమా యేజెంటు తక్కిన అన్ని కమిషనువ్యాపారస్థులవలె తన యిష్టమువచ్చిన కంపెనీ లన్నిటికిన్నీ ఏక కాలమున వ్యాపారమును సమకూర్చి కమీషను లాభమును పొందే స్వతంత్రము కావలెనని యీ కాలపు భీమాఏజెంట్లు కోరుచున్నారు. భీమాకంపెనీలన్నియు స్పర్ధావైషమ్యములు లేకుండా అన్యోన్య స్నేహభావముతో వ్యాపారం చేయుటకున్నూ పోటాపోటీలతో చేసే అధిక వ్యయములను మాన్పుటకున్నూ యీ సంస్కారము తోడ్పడగలదని కొందరివిశ్వాసము.

కాలోచితముగా ప్రవర్తిల్లుచున్న యీ నూతనాభిప్రాయ వాంఛల నెల్ల సిద్ధింపజేయుటయే పరమలక్ష్యముగా పెట్టుకొని హిందుస్థాన్ మ్యూచుయల్ ఇన్స్యూరెన్సు కంపెనీ లిమిటెడ్ అనే సంస్థను అనివార్యంగా నెలకొల్పితీరవలసి వచ్చింది. ఇప్పుడు దేశంలో పనిచేస్తూన్న భీమా కంపెనీ లన్నిటితోను వాదించి వారందరిచేతనూ ఒప్పించి యీ నూతనాశయములను వారిచేతనే అమలు జరిపింపజూచుట ఎంత కష్టసాధ్యమైన కార్యమో, పాఠకులే ఊహించుకో గలరు. ఈ క్రొత్తదారి భీమావ్యాపారమునకును దేశప్రజలకును మహోపకారము కాగలదని విశ్వసిస్తూన్నాము. జీవిత భీమా కంపెనీలు ప్రజలకు చేయదగిన ఉపకారము లెన్నోగలవు. భీమాకంపెనీలు తమ పట్టాదారులకు ఏటేటా వైద్యపరీక్ష చేయించి వారి ఆయురారోగ్యములను కాపాడవచ్చును. నిరాకరింపబడిన దరఖాస్తుదారులకు ప్రారంభదశలోనున్న అతిమూత్రము, క్షయ మొదలైన క్రూరవ్యాధి చిహ్నములను వారికి సకాలములో తెలియజెప్పి వారి ఆరోగ్యాభివృద్ధికి తోడ్పడ వచ్చును. నిరంతరాభివృద్ధిగా సమకూడు యీభీమాకంపెనీల ద్రవ్యముతో ఋణవిమోచన బ్యాంకులను (Redemption Banks) స్థాపించి, ఋణగ్రస్తమైన రయతులోకమును ఎంతో ఉద్ధరించవచ్చును. అమెరికా మున్నగు దేశములలో యీ భీమాకంపెనీలుచేయుచున్న ప్రజాహితకార్యములను గూర్చి వింటే ఎంతో ఆశ్చర్యము కలుగుతుంది.

[ కృష్ణాపత్రికనుండి ]

# Selection of a Life Office

(By V. ANJANEYA GUPTA Esq.)

The progress of insurance habit amongst our countrymen is fairly steady. Agents, being numerous, are intensively canvassing. The insurance offices too, out of competition for larger business, are offering their agencies to every layman in the street. They are further offering a greater percentage of commission to agents and bonus to policy-holders.

Very few study the prospectuses of the several companies and insurance is generally effected either for obligation to agents or by the undue influence brought on by agents. In order to help the insuring public, I wish to suggest the following tips. It is left for the prospect to apply them to the company in view and see for himself how far it satisfies.

*Security* :—The essential factor of a life office is its capital or its financial security. On account of the recent fall in Government securities, payment of the required deposit to Government to start a life office has become very easy. Very few companies have a large capital. Some agents show their company's life funds as the size of their life office and prospects are thus generally carried away. Life fund is no criterion, as it is larger or smaller according to the commitments of the office.

*Investment* :—After knowing the security of the company in view, one should reasonably question about the investment policy. The three kinds of investments in practice are 1. gilt edged securities. 2. shares of industrial firms. 3. immovable properties. Experience proves beyond doubt that large investments in immovable properties and in shares of commercial firms are not quite satisfactory. It is therefore essential for the prospect to know the percentage of the company's investments under the above three heads. This investment policy is dependant upon the board of management that steers the ship of life office. Large funds entrusted to men of business inexperience may prove suicidal to the office. Wealthy, influential and business magnates on the managing board would be an asset to the company and hence to policy holders.

*Expense ratio* :—This is a very important factor that most of the insuring public never care to know from the agent. In this connection the prospect should enquire the ratio of expenses to the first years premiums and to the renewal premiums. Companies working with heavy expense without proper return of business, are bound to fail in due course.

*Bonus* :—The insuring public, at least a major portion of them, before knowing the details that form a sound company, simply ask the agent 'what is your bonus Mr...........' They grope under an illusion that big bonus is a criterion. Paying a higher premium and buying a big bonus is not at all a good bargain. Whether large or small the bonus, declared by all the companies compared to the premiums charged, do not show any marked difference except perhaps by a couple of rupees in some cases. The insuring public should not therefore regard bonus as a criterion.

*Policy features* :—A policy is a contract between the company on one hand and the policy-holder on the other with certain conditions and stipulations. It is the features of the policy that directly affect the assured. The insuring public, after satisfying themselves of the above facts, should enquire of the policy features.

To name them I would mention:

1 Easy instalments without extra charge.
2 Easy revival of lapsed policies.
3 Automatic non-forfeiture of lapsed policies.
4 Accidental death benefits.
5 Physical disability benefit.
6 Financial disability benefit.

I therefore urge the insuring public to enquire and thoroughly satisfy themselves on the various points mentioned above before they lay their hands on any proposal form.

# Life Insurance As a Profession

( By GURU RAJAH )

We have been recommending educated young men to take up to this Insurance job, as this must be a learned profession. This must be justified by the work turned out by educated men who are already in the line. Unless one forms the habit of learning and applying such knowledge to practice, he cannot be distinguished as a learned person. It is a strange thing that many men in this profession have not formed this habit and are far behind the recent developments of Life Insurance business and how this service is being extended to the benefit of humanity in several spheres. When one gets into regular business, he thinks he has learned enough and need not learn any more. No doubt they have acquired intellect and discipline from their College learning but this is only the minimum of learning that is needed. They must reflect upon the knowledge got by study, analysed and arranged to interpret it to more useful channels by practice. The effects of this lethargy of the mind are lamentable in all persons who yield to it, but they are specially detrimental to Insurance workers, for they are deprived of interest in life and thus of efficiency in their profession. It is imperative for an Insurance man to maintain a level of excellence ; he either surpasses himself or often sinks below himself. We should not for a moment be regarded as a spent-up force. Men in the profession must keep abreast of the times with the latest advances of this industry.

This is the main reason why we should all of us aim at learning to keep our souls alive. The Insurance man shares the large world with his fellow-men of all grades and its wealth is there for him to explore according to his power and his tastes. He has his special province and that has three closely related parts, the service which he has to do, his method and technique, and the public. However elementary the stages of the subjects over which he travels with the public, it will always be necessary for him to learn more about them. The initial work among new men may be elementary but all the same we must be students and be meditating deeply upon our actions and improve stage by stage.

*A Fresh Significance of Life Insurance Proffession*: Supposing we have found out a method ot technique successful in the past, we cannot be content to practise the same. It must have served us well in the past, but if the same method is repeated, people can detect our performance. Even if there is no actual significance, there must be some fresh significance for ourselves in what we do. Our subjects and our modes of dealing with them are fields for research. In both we need learning and more learning.

Let us now turn to the public – the third part of our province. About them too, we need learning and more learning. It means neither more nor less than looking again and again into familiar matters and discovering something new in them, some fresh significance or some hitherto untried application. The Insurance men must combine the temper of the artist as well as that of the scientist. For Art is the proof of inspiration and Science helps in direction i.e. in achievement

Let us now look at our clients. "How well we know them?" Shall we say "How little we know them?" In fact we do not know of what they do during the hours of the day, how little of what goes on in their minds, how little of their emotions, their fears, their hopes and their future plans. If we could know how to answer these accurately, we would know that it would be a work of Art, the product of close observation combined with imagination and inwrought with sympathy. We suggest that every Insurance man does this and having done this, would give us their experiences and success. This would enrich not only the man in the profession but would aid the educational and psychological literature on the subject.

Reg. No. M. 2749.



Printed and Published by the Editor at the Andhra Grandhalaya Press, Bezwada.